శ్రీ

# నందిరాజు లక్ష్మీనారాయణ
# దీక్షిత శతకము.



వఝు / సూర్యనారాయణకవి,

విరచితము.

ప్రథమ ముద్రణము 500.

శ్రీ అత్రి-వాణీ ప్రెస్, బాపట్ల.

1938.

 [ వెల 0—2—0.



# శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ

# దీక్షిత శతకము.

—(౦)—

శ్రీ మహితాచార • శిష్టభూయిష్ఠ ప్ర
కాశితార్యావర్త • దేశమందుఁ
కలికాలవశమునఁ • గులధర్మములడంగి
వర్ణసంకరము గా • వచ్చినంత
విశ్వహితార్థమై • యీశ్వరాంశమ్మున
నాదిశంకరుఁడవై • యవతరించి
తగువాదములదుర్మ • తంబులు ఖండించి
సన్మతస్థాపన • సలిపియేగి

యప్పటప్పటికరుదెంచి • యరయవలసి
హరిహరాంశనుమరలి యీ • యవనికవత
రించియద్వైతమతము భా • గించినావు
రమ్యగుణధుర్య లక్ష్మినా • రాయణార్య॥

సీ॥ జగమున బ్రహ్మవం ♦ శవిభూషణంబయి
ధర్మనయాభయ ♦ దానమాన
ధైర్యశౌర్యాతిగాం ♦ భీర్యనియోగాది
పురుషలక్షణములఁ ♦ బొదలి శౌచ
దానదయాసత్య ♦ దీనరక్షణశీల
ముఖ్యసద్గుణగణం ♦ బులఁ దనర్చి
యున్నతిగన్న ని ♦ యోగివంశమునంది
నందిరాజాన్వయా ♦ బ్ధీందుఁడనఁగ

ఘంటయామాత్యమణినోము ♦ పంటయనఁగఁ
జిన్నమాంబాసతీ లస ♦ చ్ఛీతగర్భ
శుక్తిముక్తాఫలంబన ♦ శోభిలితివి ॥రమ్య॥

సీ॥ దీర్ఘదేహునకును నం ♦ దీయందకుండెడి
శాఖను గుజ్జుచే ♦ సాఁచినట్లు
బలియున కనుమాన ♦ పఱిచెడిభరమెత్త
బలహీనుఁడుత్సాహ ♦ పడినయట్లు
ఈఁతగానికి సంశ ♦ యింపనౌ సేతోఁద
లేని యాతఁడు దాఁటఁ ♦ బూనినట్లు
దృఢపాదునకును బు ♦ ద్ధిచలింపఁజేసెడు
గిరిఁ బాఁకఁ గుంటియుం ♦ కించినట్లు

సుకవులకు సంతుపడని నీ ♦ శుభచరిత్ర
వ్రాయఁబూనితి శతకాన ♦ వాంఛఁజేసి
యెట్లు నెఱవేర్చుకొందు వ్రా ♦ యనెఱుంగ

సీ॥ వ్రాసెమున్నగ గాది • రాజు కోటీశ్వర
శౌరి కబ్బమొకండు • సంస్కృతమున
గవ్యరూపుగఁ జేసె • గ్రంథ మొక్కటి కను
పర్తి మార్కండేయ • పండితుండు
దండిమార్గమునఁ గో • ట్కొండ వేంకటరత్న
కవివర్యుఁడొనరించెఁ • గావ్యమొకటి
యబ్బరాజకుల ప • యోధిచంద్రుఁడు కృతి
రచియించె హనుమంత • రాయసుకవి

వీరలమల ప్రబంధ జి • హ్వాకలఁ గొంత
నీచరిత్రామృతము చవి • చూచి రేను
సీసశతకనాసాఘ్రాణ • మానపడితి ॥రమ్య॥ 4

సీ॥ నా మనంబది చిన్న • నాఁటనుండియు భవ
చ్చారిత్ర వ్రాయంగ • సాహసించు
వ్రాయఁగల్గుదునో లే • దో యిట్టిదేనన్న
యనుమాన దేవత • యడ్డగించు
నీరీతిఁ గడచిన • దింతకాలంబిప్పు
నీ ప్రవేశ్యుండు స • న్నిధియొనర్చి
తిర్పెఁ గోటీశ్వర • దీక్షితుఁ డనుమాన
దేవతయడ్డంకి • దివ్యబోధ

నామహామహుండే కలఁ • డన్నిటికిని
సంశయమ్ముమాని రచియింపు • శతకమనుచు
రమ్యగతిఁజేసి యీపని కేను • బూనినాఁడ ॥రమ్య॥ 5

సీ॥ కృష్ణామహాతరం ♦ గిణి సాగరునితోడఁ
కలియ నెయ్యది కేళి ♦ కాగృహంబు
సరస యౌవనదశా ♦ పురుషాయితక్రియా
భోగంబులకు నేది ♦ పూలపాన్పు
ఉర్విపై నేయది ♦ పర్వకాలస్నాన
పుణ్యంబులకు నెల్లఁ ♦ బుట్టినిల్లు
పరమభాగవతాది ♦ బహుపురాణంబులు
వినిచి స్వర్గముచూఱ ♦ విడుచు నెద్ది

యట్టి హంసలదీవిమ ♦ హాస్థలంబు
పొంత వెలుఁగొందు రేపల్లె ♦ పురమతల్లి
కాఁపురంబటె నీ పుణ్య ♦ కాయమునకు ॥రమ్య॥

సీ॥ రేపల్లెనగరికి ♦ రెండుక్రోసులమాత్ర
దూరమై యొప్పారు ♦ ధూళిపూడి
పురవరంబునను గాఁ ♦ పురముండియును నగో
త్రుండనై శాఖాయు ♦ తుండనయ్యు
నీకుశిష్యుండన ♦ నెగడి వినయధురం
ధర రామయామాత్య ♦ వరతనూజ
వర్షువంశక్షీర ♦ వార్ధిచంద్రా! సూర్య
నారాయణా! యంచు ♦ నన్నుబిలిచి

పనివనుపఁ జేయునట్టియా ♦ భాగ్యమునకు
నోఁచనైతిఁగదా యని ♦ వాచవులకు
ముదముతని వ్రొక్క చునుకొని ♦ మురియుచుందు ॥రమ్య॥

శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితశతకము.

సీ॥ నీప్రియశిష్యుండ ♦ నేనయి కరుణ నీ
వ్రాలి వాఙ్మాధుర్య ♦ మొప్పనొసఁగు
పనసపండ్లను నోటఁ ♦ బట్టి కఱచుచు శు
శ్రూషసేయుచు భక్తి ♦ తోషణములు
గదురంగ నీపాద ♦ కమలంబులర్చించి
వినుతించుటది సంభ ♦ వింపకున్న
నీమహిబ్రహ్మతే ♦ జోమయంబై యొద
విన దివ్యమంగళ ♦ విగ్రహంబు

కనుల్గనెనను నేఁజూడఁ ♦ గాంచిఫలము
గాంతుననుకొన్న నీవునా ♦ కన్నుదెఱచు
నప్పటికె వేగపడిపోయి ♦ తమరపురికి ॥గమ్య॥ 8

సీ॥ పుడమిపైనీకింక ♦ దడవునే ముఁగరామి
నాశ్రమంబుల రయ ♦ మారనడిపి
యింద్రాదిదిక్పాల ♦ బృందారకసపర్య
లంది గమ్యస్థాన ♦ మందుఁ జేరి
బ్రహ్మతేజంబురాఁ ♦ బనిచి ద్వైతాద్వైత
మాది నిరయోగి మ ♦ ర్యాదలెల్ల
నెలకొల్పివచ్చితి ♦ నియతంబుతో వాని
రక్షింతు నేనని ♦ దీక్షఁబూని

ధరణిపైఁ బుట్టు మిరుమేను ♦ దాల్చియునిన
నామహాతేజ మేది నా ♦ కర్హపదము
యానతిమ్మని నిన్నుదా ♦ నడిగినదఁట ॥రమ్య॥

సీ॥ కామరాజకులాబ్ధి • సోముండు కాశ్యప
గోత్రుఁ డాపస్తంబ • సూత్రకలితుఁ
డార్యుఁ డాసేతు హి • మాచలయాత్రలు
కాల్నడ సేవింపఁ • గన్న సుకృతి
షట్సహస్రనియోగి • శాఖాజనితుఁడు స
త్యవ్రతాన్వితుఁడు న్వ • ధర్మరతుఁడు
బహుపురాణజ్ఞుండు • పలువురఁ జదివించి
పద్ధతికిసహాయ • పడినమేటి

సూర్యనారాయణశాస్త్రి • సుసతి ధర్మ
పత్నిగా రామలక్ష్మమాం • బనుగ్రహించి
నచటఁబుట్టుము పొమ్మని • యనిచితివఁట ॥రమ్య॥

సీ॥ ఆబ్రహ్మతేజ మీ • వానతిచ్చినభంగి
నాపుణ్యమూర్తుల • కాత్మజులుగ
క్షోణిపైజన్మించి • కోటేశ్వరాభిధా
నమున మార్కండేయ • నామమునను
వెలసెఁగాకుండిన • వీరుశాస్త్రిస్మార్త
కర్మాభియోగంబు • గాంతురెమటి
వేదశాస్త్రక్రమ • వేదిత్వమును సర్వ
ధర్మశాస్త్రార్థత • త్వజ్ఞతయును

ఆవికాసత్వ మారూప • మావిలాస
మామహాతేజ మాశీల • మా నియమము
లొక్కచోవీరి యొడఁగూడి • యొప్పెఁగలవె ॥రమ్య॥

సీ॥ దేవరపంపిన ♦ దివ్యతేజులుగాక
యింపుతో గురుపీఠ ♦ మెక్కఁగలరె
యెక్కి స్వీయులకు నీ ♦ యీభవ్యతత్వంబు
బోధింతుమని దీక్షఁ ♦ బూనఁగలరె
పూని పూనికతోడ ♦ భూప్రచారములచే
నొదవుతనుక్లేశ ♦ మోర్వఁగలరె
యోర్చి పల్వురనోడఁ ♦ గూర్చి పద్ధతి కార్య
మింతపట్టుగ నిర్వ ♦ హించఁగలరె

ధీవిశాల కోటీశ్వర ♦ దీక్షితార్య
సార్వభౌమ-మార్కండేయ ♦ శర్మ లామ
హాత్ము లిది వ్రాయఁ బ్రేరకు ♦ లైరి నాకు ॥రమ్య॥ 12

సీ॥ పాతాళపద సుధా ♦ పంకనిర్మిత మణి
గోపురంబున నల ♦ గోపురంబు
నవనిధిశ్రీకీర్తి ♦ ధవళాబ్జనయనల
కాఁపురంబున నల ♦ కాపురంబు
రంభోరుశృంగార ♦ రమణీమణీవిహార
కూబరంబున నల ♦ కూబరంబు
చతురాస్యముఖ విని ♦ ర్గతవాక్యరత్నాళి
దాపురంబున శార ♦ దాపురంబు

రాజమాణిక్య మాణిక్య ♦ రావువంశ
రత్నజంగన్నరాయసు ♦ రక్షితంబు
భూవినుతంబు రేపలీ ♦ పురవరంబు ॥రమ్య॥ 13

సీ॥ అర్థిమరుచ్ఛాఖి ♦ యాశ్వలశాఖకుఁ
గిరివల్లరులఁబ్రా ♦ కించినావు
మహితభరద్వాజ ♦ మౌనిగోత్రంబు ప
విత్రోన్నతంబుగా ♦ వించినావు
ఘననియోగి సువర్ణ ♦ మునకు మాలిన్యంబు
దీర్చి మేలిమివన్నె ♦ దెచ్చినావు
స్వజనమ్ము పరధర్మ ♦ సంకటంబున నున్న
చో స్వధర్మపథంబు ♦ జూపినావు

నీమహద్గుణముల నెన్న ♦ నేర్చునెవఁడు
సరసి లెక్కింప శేషుండుఁ ♦ జాలఁడనిన
నోలినన్నియుఁబలుక న ♦ న్యులకువశమె ॥రమ్య॥ 14

సీ॥ కృష్ణకుఁబడమటి ♦ కెలన సంద్రమునకు
నుత్తరదిక్కున ♦ నొప్పుచున్న
రేపల్లెనామపు ♦ రీవరమున నివా
సము బ్రహ్మవంశవృ ♦ క్షంబునందు
పట్నహాస్రనియోగి ♦ శాఖభారద్వాజ
గోత్ర మాపస్తంబ ♦ సూత్రమింక
నద్వైతమతము ద్వై ♦ వాద్వైతమతకర్త్రు
కంబుదీక్షితనామ ♦ కంబు మఱియు

నందిరాజాన్వయంబు ఘం ♦ టయమనీషి
చిన్నమాంబల గర్భవి ♦ శిష్టజన్మ
మెవ్వనికిఁగల్గెనాయన ♦ నీవకావె ॥రమ్య॥ 15

సీ॥ మహి నాల్గువేలతో ♦ మ్మనూట యిరువది
కలియుగాబ్దంబుల ♦ కాలమునను
శాలివాహనశక ♦ సంవత్సరంబులు
పదియేడునూర్ల న ♦ ల్వదియొకంట
నడుచుచున్న ప్రమాది ♦ నామ సంవత్సర
మందుఁ బుణ్యోత్తరా ♦ యణమునందు
జ్యేష్ఠమాసంబున ♦ సితపక్షమున నవ
మిని సౌమ్యవాసర ♦ మున దినంబు

నందున ద్వితీయయామంబు ♦ నందుఁ గటక
లగ్నమునఁ జంద్రహోరను ♦ లలితవేద
మూర్తినుదయించితివి ఘన ♦ కీర్తి వెలయ ॥రమ్య॥ 16

సీ॥ నందిరాజకులాబ్ధి ♦ నవకళానిధివయి
దినమునకొక దివ్య ♦ తేజ మొనఁగ
నభివృద్ధినొందుచు ♦ నయిదేండ్లప్రాయాన
సురకోటికెక్కిన ♦ శుభదినమున
నక్షరాభ్యాసక్రి ♦ యారంభమై నాఁడె
యైదుబళ్లను వ్రాసి ♦ యప్పగించి
గుణితంబు గణితంబు ♦ గురుఁడు చెప్పినవెల్ల
నప్పటికప్పుడే ♦ యొప్పఁజెప్పి

తోడిబాలురవెనుకకుఁ ♦ ద్రోసివచ్చి
యప్పటికిఁ దగుచదువుల ♦ నారితేరి
గురుల కధికప్రమోదంబు ♦ గూర్చితివఁట ॥రమ్య॥ 17

సీ॥ శాస్త్రోక్తమగు వయ ◆ స్సమయ మియ్యది యని
తండ్రి మేలగుముహూ ◆ ర్తంబు గాంచి
యుత్తరాయణమున ◆ నుపనయనంబు స
ద్విజసమ్మతిగ యథా ◆ విధి నొనర్ప
బ్రహ్మోపదేశంబుఁ ◆ బడయుటాదిగ యుక్త
కాలంబు దప్పక ◆ క్రమముతోడ
వటుధర్మముల నను ◆ వర్తించి నియతముల్
దీర్చెదనని గురు ◆ దీక్షఁబూని

యసురవరగర్వ మడఁగింప ◆ నాత్మ నెంచి
యిమ్మనుచు వేడఁబోని యు ◆ పేంద్రుఁడనఁగ
నాచరించితి బ్రహ్మచ ◆ ర్యవ్రతంబు ॥రమ్య॥ 18

సీ॥ వ్యయవత్సరమున శ్రా ◆ వణశుద్ధపూర్ణిమా
తిథినాఁ డుపాకర్మ ◆ దీరిచి మఱు
నాఁడు రామడుగు క ◆ నకయదీక్షితునొద్ద
జదువుము వేదంబు ◆ చనుమటంచు
జనకుండు ఘంటయు ◆ సచివాగ్రణి వచింపఁ
దండ్రియానతిఁ ద్రోయఁ ◆ దగదటంచు
నరిగి యాతనివేద ◆ మడిగిన వేదంబు
నీకేల పెరవిద్య ◆ నేర్చికొమ్ము

పొమ్మనుచు నాతఁడాడినఁ ◆ బోయిగురున
కదినివేదించి యిటుసత్సి ◆ తాత్ములెందు
సమతకోరువలేరని ◆ చాఁటినావు ॥రమ్య॥ 19

గీ॥ అంత ఘంటయమంత్రి ♦ యన్యదేశములు ని
న్ననిచిపుచ్చఁగ బాలుఁ ♦ డనితలంచి
స్వగ్రామమైన రే ♦ పల్లెపట్టణమందుఁ
బ్రస్తుతంబునఁ గావ్య ♦ పరిచయమున
సంస్కృతాంధ్రింబుల ♦ సాహిత్యము ఘటిల్లు
నంతకుఁ జదివింప ♦ నగునటంచు
వ్యాకరణమును ది ♦ వాకరణము రామ
యోగిశాస్త్రియే చెప్ప ♦ నోపుననుచుఁ

దాను నివియెల్లఁజెప్పంగ ♦ దక్షుఁడయ్యు
వ్యావహారికములనిది ♦ వలనుపడమి
ననిచె నాతనికడకీవు ♦ నరిగినావు ॥రమ్య॥ 20

సీ॥ అరుణోదయంబగు ♦ నంత కేమేల్కాంచి
తాత్కాలితములఁగృ ♦ త్యములఁదీర్చి
స్నానసంధ్యాద్యను ♦ ష్ఠానక్రియా నియ
మంబులెల్లవిధిక్రి ♦ మముగ నెఱపి
కౌపీనమును గూడ ♦ కట్టు నోప్పారంగఁ
గృష్ణాజినమ్ముపై ♦ వ్రేలవైచి
ముఖపద్మమున నూర్ధ్వ ♦ పుండ్రత్రిపుండ్రముల్
చెలువారఁబొత్తముల్ ♦ చేతబూని

యనుదినముఁ బాఠశాలకు ♦ నరుగుదెంచి
కాళిదాసత్రియం బాది ♦ కావ్యములను
జారవతోఁ జదువుదువఁట ♦ గురునితోడ ॥రమ్య॥ 21

సీ॥ బ్రహ్మతేజ స్వరూప ♦ సంబిద్ధి గాకున్న
ముఖపద్మమున కింత ♦ మురువుగలదె
హరిహరనాథుఁ డీ ♦ యనఘుండుఁగాకున్న
నుభయచిహ్నము లిట్లు ♦ లొప్పనవియె
శ్రీరామచంద్రుఁ డీ ♦ చెలువుండుగాకున్నఁ
గాంతలదెస విము ♦ ఖత్వము నెనె
శారద పురుషావ ♦ తారంబు గాకున్న
వాగ్గరిమం బిట్లు ♦ వఱలగలదె

అనుచు వివిధంబులుగఁ గొని ♦ యాడుఁదఁ రఁట
సంతతము నీను ముఖవిలా ♦ సంబుఁజూచి
యట్టి దివ్యావతార మే ♦ నటె వచింప ॥రమ్య॥ 22

సీ॥ రేపల్లెప్రజలు నీ ♦ రూపరేఖావిలా
సంబులువీక్షించి ♦ సంస్తుతింప
రేపుమాపును గాల ♦ కృత్యముల్ నెఱవేర్చి
బడికేగి నిత్యంబుఁ ♦ బాఠములను
బుద్ధికౌశలమునఁ ♦ బూర్వపాఠకు లెక్క
రాకుండఁ జదువుట ♦ రామయోగి
భాగినేయుఁడు విశ్వ ♦ పతి పాపమతి దానుఁ
బూర్వపాఠకుఁ ♦ డాట నోర్వలేక

లోఁదపించుచు నను విద్య ♦ లో నితండు
మాంద్యుఁడనిపించె నీయువ ♦ మాన మెట్టు
లీఁగుదు నటంచు బుద్ధిహా ♦ హించుచుండె ॥రమ్య॥ 23

సీ॥ మనమీతనిని నిద్ర ♦ మాని చదివి,యవ
మానించఁ గలమన్న ♦ మాట సున్న
బడినుండె యీతండు ♦ పాయునట్లుగఁ జేయు
టొప్పగు మనకు నీ ♦ యుక్తికన్నఁ
బరిభవం బీఁగు ను ♦ పాయంబు వేఱొండు
తోఁచదు దానికే ♦ తోవగలదు
శాఖావిషయమైన ♦ చర్చకుదిగి తార
తమ్యంబులెత్తి వా ♦ దంబొనర్చి

బూటకములేవొ మామకు ♦ నాటఁజెప్పి
వెడలఁగొట్టించుటయె ♦ తప్ప వేఱుత్రోవ
లేదనుచు జొచ్చెనీతోడి ♦ వాదమునకు ॥రమ్య॥ 24

సీ॥ మున్మున్ను మముఁగాంచి ♦ మ్రొక్కవేమిటి కది
ధిక్కారమో లేక ♦ దీక్షయొక్క
మమ్మందఱను నవ ♦ మానించుటకుఁగాక
కృష్ణాజినంబు నీ ♦ కేల యిచటఁ
జదరలఁ గూర్చుండి ♦ చదివెదు మన గురు
శిష్యులందఱకన్న ♦ శిష్యుఁడవొకొ
బ్రాహ్మణుఁడేని నీ ♦ బడి నానికూర్చుండఁ
జోటీయ వీవంత ♦ శోత్రియుఁడవె

యనుచు నీపుట్టువెఱుఁగక ♦ యాగ్రహమున
విశ్వపత్యసురుం డవి ♦ వేకియగుచుఁ
బల్లదంబులు నినుగూర్చి ♦ పలుకఁ దొడఁగె॥రమ్య॥25

సీ॥ జంగనరాయ భూ ♦ జాని పండిత కవి
మండితంబగు సభా ♦ మండపమున
కొకనాఁడు రామయో ♦ గికి మాఱుగాఁ బురో
హితధర్మమున విశ్వ ♦ పతి చనంగ
బరిచయుండగుట నా ♦ ధరణీశుఁ బోడగాన
నేగితివీవు ధా ♦ త్రీశ్వరుండు
నీవిషయంబున ♦ దేవభావుఁడుగాన
బాలుండనక లేచి ♦ భక్తిమీఱ

గీ॥ నభిముఖంబుగవచ్చి సా ♦ ష్టాంగదండ
మాచరించి యితండు ప్ర ♦ త్యక్షదైవ
మనుచు నినుదెచ్చి తగుపీఠ ♦ మందు నిలిపె ॥రమ్య॥ 26

సీ॥ రాజసన్మాన ♦ విభ్రాజి వౌటకు విశ్వ
పతిలోనఁ గలవర ♦ పడుచు మదిని
నెడఁద తాపంబునఁ ♦ బడియున్నయాతని
యొడలుగాల్చిన యట్టు ♦ లున్నదిపుడు
చదువున నముమించి ♦ చనె నితండని వగఁ
బొందుచుండంగ నీ ♦ భూవరుండు
నేఁజూచుచుండ వీ ♦ నికి గౌరవంబిచ్చె
వైరియున్నతి కెట్టు ♦ లోరువఁదగు

గీ॥ నని పరాభవఘోరదా ♦ వాగ్నిదగ్ధ
మానసారణ్యుఁడై రాజ ♦ మౌళితోడ
నాతఁడిట్లని నిన్నెగ్గు ♦ లాడఁదొడఁగె ॥రమ్య॥ 27

సీ॥ ఎదురేగి సాష్టాంగ ♦ మిడి యీతనిందెచ్చి
యున్నతాసనమున ♦ నునుచుటరయ
మము జోటులను నవ ♦ మానించు టగుఁగాని
యెబ్బంగిఁజూచిన ♦ హితముగాదు
మాముందు వీరు న ♦ మస్కారయోగ్యులే
యరయక మీరు సా ♦ ష్టాంగమిడినఁ
గాదన కిటుఁ డహం ♦ కార భావంబుతోఁ
జేకొనెఁ దనకది ♦ సిగ్గువిడిచి

గీ॥ యనుచు ధర్మజు రాజసూ ♦ యాధ్వరసభ
యందు గృష్ణుని శిశుపాలుఁ ♦ డట్లు రాజ
భవనమునఁ దెగి నిను విశ్వ ♦ పతియుదూఱె ॥రమ్య॥ 28

సీ॥ రాజులువీ రేము ♦ బ్రాహ్మణులముగాన
వందనీయులము మే ♦ మందఱకును
క్షత్రియులకు మొ్రక్కఁ ♦ జనదు వీరలు
నందిరాజువా రిఁక గురు ♦ రాజుతాత
ఇట్లెనియోగుల ♦ కింటిపేరులు పేరు
లెల్లచోటులయందుఁ ♦ జెల్లుచుండు
గావున బ్రాహ్మణుల్ ♦ గారు నియోగులు
రాజులౌటను నిద ♦ ర్శనములివియ

గీ॥ అని నృపాలునితో ♦ నిట్టు లాడనతఁడు
విశ్వపతిమాట కేమిచె ♦ ప్పెదవో చెప్పు
మనినఁ జెప్పితి రాజశ ♦ బ్దార్థమిట్లు ॥రమ్య॥ 29

సీ॥ రాజుశబ్దమున క ♦ ర్థములెన్నియో కల
వవియట్టులుండ బ్రా ♦ హ్మణులలోన
నాది దుర్గాన దు ♦ రన్న ప్రియులుగాక
రాజమంత్రిత్వ వి ♦ రాజితులయి
నట్టి నియోగుల ♦ యభిధానముల తుద
శ్రేష్ఠవాచకముగఁ ♦ జేర్చఁబడియె
గాని రాజను మాట ♦ క్షత్రియులగుటచేఁ
గలిగినదని చెప్పఁ ♦ గాదుమఱియు

గీ॥ వారిలోఁ బెద్దపేరొందు ♦ వారిపేర
నింటిపేరులు నేర్పడె ♦ నింతనిజము
తెలియుఁడని తెల్పితివి తేట ♦ తెల్లమిగను ।రమ్య॥ 30

సీ॥ తేటతెల్లమిగ నీ ♦ తెల్పినయర్థంబు
విని విశ్వపతిసేసె ♦ వెఱ్ఱిప్రశ్న
రాజను నామ మే ♦ ర్పడె నియోగుల కది
శ్రేష్ఠవాచకమయి ♦ చెల్లునంటి
రాజశబ్దంబు జే ♦ రని నియోగులుకూడ
శ్రేష్ఠులెవ్విధినైరి ♦ చెప్పుమనుచు
రాజనామము లేక ♦ రాజులెట్లయి రట్ల
శ్రేష్ఠులైరనిన ని ♦ ర్వీణుఁడయ్యె

గీ॥ నొరులయున్నతి కోర్వమి ♦ యొకటిదక్క
సవ్య మపసవ్య మెఱుఁగని ♦ ఛాందసులకు
యుక్తియుక్తంబు లెందుండి ♦ యొదవఁగలవు ॥రమ్య॥

సీ॥ బ్రాహ్మణు లితరేత ♦ ర ప్రణామక్రియా
సంభావితులు పర ♦ స్పరముగురువు
లని నీవు ప్రభునితో ♦ ననుచుండ విమతుండు
కన్నులు గెంపార ♦ నిన్నుఁజూచి
మేము బ్రాహ్మణులము ♦ మీరు బ్రాహ్మణులరు
మేము గురువులము ♦ మీరు గురులు
మాకు నమస్కృతి ♦ మీకునమస్కృతి
చెల్లునే నిన్ను ని ♦ ర్జింతుననుచు

గీ॥ వాసుదేవునిఁ బౌండ్రక ♦ వాసుదేవుఁ
డెదిరినట్లుగ నీదులా ♦ వెఱిఁగియెఱిఁగి
యెదిరె నిను విశ్వపతియు మీఁ ♦ దెఱుఁగ లేక ॥రమ్య॥

సీ॥ భారతం బది విశ్వ ♦ పతి గనండో వినండో
నారదముని ధర్మ ♦ నందనునకుఁ
దెలిపిన రాజనీ ♦ తి విశేషములఁ బాప
రహితులుఁ దన కను ♦ రక్తులైన
విప్రులు మంత్రులై ♦ వెలయు టవశ్యంబు
రాజున కన్న ధ ♦ ర్మమునఁ జేసి
మంత్రిపదంబు బ్రా ♦ హ్మణభాజనంబని
తరతరంబులనుండి ♦ బిరుదములుగ

గీ॥ మంత్రులని సచివులని యు ♦ మాత్యులనియుఁ
బ్రెగడలనియు నియోగులు ♦ పిలువఁబడుట
బ్రాహ్మణశ్రేష్ఠులని పేరు ♦ పడుటెఱుఁగఁడు ॥రమ్య॥

సీ॥ బ్రాహ్మణుల్ శర్మలు ♦ రాజులువర్మలు
నితఁడు నియోగుల ♦ కేదినుడువు
రాజపేరున మేము ♦ రాజులమైనను
భట్టుపేరున మీరు ♦ భట్టులగుట
యేమి యపూర్వమా ♦ నీఁక రాజశబ్దంబు
శ్రేష్ఠవాచకమని ♦ చెప్పకున్న
మునిరాజు కవిరాజు ♦ మొదలగువాని కే
మని యన్వయముచెప్ప ♦ నహువుపడునొ

గీ॥ పలుకవలవదె యనిన నీ ♦ ప్రశ్నములకు
నుత్తరంబేమి లేక లో ♦ నుమ్మలించి
విశ్వపతి సిగ్గుగదురంగ ♦ వెడలిపోయె ॥రమ్య॥ 34

సీ॥ నిన్నాదరించి నిం ♦ దించి నీచేత దు
ర్మతి విశ్వపతి రాజ ♦ మందిరమునఁ
బరిభూతుఁడై పోయి ♦ గురుఁడు మాతులుఁడైన
రామయోగి పదప్ర ♦ ణాముఁడగుచు
మామ! నీతో నొక్క ♦ మనవిచేసెద మన
రాజుసన్నిధి నంది ♦ రాజు లక్ష్మీ
నారాయణుఁడు నిన్ను ♦ నన్ననఁగానేల
సకలవైదికుల ని ♦ ష్కారణముగ

గీ॥ నిందగావించెఁ గావున ♦ నేఁడుమొదలు
వాఁడు మన పాఠశాలకు ♦ వచ్చెనేని
వలదు పొమ్మని నీ వన ♦ వలయు ననియె ॥రమ్య॥ 35

సీ॥ పాఠశాలకు నేడఁ ♦ బాపు మాతని నింక
వేయేల యని తన్ను ♦ వేడుకొన్న
నది యేలవచ్చె మీ ♦ కనుచు మేనల్లుని
నడుగఁ డడుగఁ జెప్పఁ ♦ డయ్యె నేని
నవనీశ్వరుని నైన ♦ నడిగి తెలిసికొనం
డది యేమి పాపమో ♦ యరయఁ డేమి
సహపాఠులగుట నే ♦ చర్చగల్గినదొ వీ
రిద్దఱికనుచు నూ ♦ హింపఁ డెదను

గీ॥ దున్న యీనినదన్నంత ♦ దూడ నందె
కొట్టమున యందుఁగట్టు ♦ మన్నట్టు రామ
యోగి యల్లుఁడు చెప్పిన ♦ ట్లొప్పుకొనియె ॥రమ్య॥ 36

సీ॥ మా తలయందె బ్ర ♦ హ్మత్వంబు నిల్చెనం
చారుల గరిష్టత ♦ కోర్వలేరు
గ్రామపాచకులును ♦ మేమె యెక్కుడటంచు
దుర్వాదములు సేయఁ ♦ దొడఁగుచుందు
రగ్రపూజాపేక్ష ♦ నధములున్ బిరుదముల్
పలుకుచుందురు సభా ♦ పతులమనుచు
శాస్త్రులమని నిర ♦ క్షరకుక్షులును డాంబి
కమునకై సాలువు ♦ లప్పుకొందురు

గీ॥ వైదికుల్ వీరిలో విశ్వ ♦ పతి ప్రధానుఁడని
నృపాలుఁడు నీవు న ♦ న్యోన్యవచన
రచనలై యుంత వీడ్కొంటి ♦ రాజవరుని ॥రమ్య॥ 37

సీ॥ రాజరత్నము సౌధ ♦ రాజంబు వెల్వడి
యాత్మ మందిరమున ♦ కరుగుదెంచి
జనకుని ఘంటయు ♦ సచివాగ్రణింగాంచి
ప్రణమిల్లి జంగన ♦ రాయనృపతి
సన్నిధియందు వి ♦ శ్వావతికి నీకును
జరిగినయానవి ♦ స్తారమెల్ల
నెఱిఁగించి రేపు నే ♦ నేగిన గురుఁడు రా
వద్దనుఁ డాఁబర ♦ వశుఁడుగాన

గీ॥ నింకఁ గర్తవ్యమేమని ♦ యీవెఱింగి
యుండియును తండ్రినడిగి తా ♦ తందునిన్ను
బొమ్మనియెఁ దప్పవార్తిపైఁ ♦ బోవు ననుచు ॥రమ్య॥38

సీ॥ మఱునాఁడు ప్రాతస్స ♦ మయకృత్యములను ని
ర్వర్తించి మునుపొలెఁ ♦ బాఠశాల
కరుగుదెంచిన వచ్చి ♦ గురుఁడు నీపొడఁగాంచి
చాలును బొమ్మ్మ మా ♦ చదువునీకుఁ
దలకెక్కినది యింకఁ ♦ దలఁగు మెచ్చటికైనఁ
బొమ్ము మాబడికి రాఁ ♦ బోకుమనిన
గురుఁ డపాత్రుఁడు శిష్య ♦ కోపంబున కటంచు
నేమియుఁ బలుకక ♦ యింటికేగి

గీ॥ తండ్రికదివిన్నవించి పు ♦ స్తకములెత్తి
చదువులన నీకు కెంతయో ♦ నక్తిగలదొ
చదువుకొనుచుంటివింట భో ♦ జనముమఱచి ॥రమ్య॥ 39

సీ॥ ఇందు రావలదు నీ ♦ వెందులకేనిఁ బో
మ్మన్న వారిమొగంబు ♦ దన్నినట్లు
దైవంబు పంపె వి ♦ ద్యావిశారదుని ద
క్షిణదేశవాసు బ్రా ♦ హ్మణు మనీషు
లబ్ధ మధ్యప్రాయు ♦ లక్ష్మీనృసింహాభి
ధాను భవత్సన్ని ♦ ధానమునకు
నా దైవమాఁగిన ♦నాఁగుఁగా కాఁగునే
గుండ్రాయిదాచిన ♦ గూఁతుపెండ్లి

గీ॥ యహహ దైవంబుకంటె మే ♦ లైన దొకటి
కలదె పరికింపఁగాఁ ద్రిలో ♦ కములయందుఁ
బౌరుషంబేల నమ్మిన ♦ బంటులకును ॥రమ్య॥ 40

సీ॥ విధిచోదితుండయి ♦ విచ్చేసిన మహాత్మ
నాదరించి నిజాల ♦ యమున నిల్పి
యాతనిముఖమున ♦ నల్పకాలములోన
లంకారశాస్త్రము ♦ ప్రహిగ్రహించి
తండ్రియానతి గురు ♦ దక్షిణలర్పించి
విధ్యుక్తముగ గురున్ ♦ వీడుకొల్పి
లాలిత్యకర శర ♦ త్కాల షోడశకళా
సంపూర్ణతకుఁ జూచు ♦ చంద్రుఁబోలెఁ

గీ॥ బదియు నాఱవయేటి సం ♦ ప్రాప్తికెదురు
చూచు నవయౌవనప్రాయుఁ ♦ జూచుజనుల
కనులపండువుసేయుచుఁ ♦ గ్రాలినావు ॥రమ్య॥ 41

సీ॥ నీబుద్ధికుశలత ♦ నీసదాచారంబు
నీదుపాండిత్యంబు ♦ నీనెఱియును
విని నందిగామ ని ♦ వేశుండు సుంకర
బంగారయామాత్య ♦ పుంగవుండు
దక్షుఁ డీశ్వరునకు ♦ దాక్షాయణింబలె
నఖిలలోక వ్యవ ♦ హారకార్య
దక్షుండు పేరమ్మ ♦ దనకూతు విద్వద
ధీశ్వరుండైన నీ ♦ కిఁదలంచి

గీ॥ ప్రాజ్ఞముఖమున రాయబా ♦ రములునడువఁ
బనిచి మీతండ్రి నతఁడిష్ట ♦ పఱిచె నిట్టి
చతురమతి యల్లుఁడన్నను ♦ జాలుననుచు ॥రమ్య॥ 43

సీ॥ తల్లిదండ్రులు సమ్మ ♦ దమ్మున నినుగాంచి
ముద్దునకై పెండ్లి ♦ ముచ్చటింప
మాఱువల్కక యొక ♦ మతినున్న నీతోడఁ
గాదని మన మనం ♦ గాదుతండ్రి
మన వియ్యమునకెంతొ ♦ మతినున్న యాతని
యాసఁ జెఱుప ధర్మ ♦ మగునెమనకు
ననిన మీచిత్త మె ♦ ట్లట్లకానిండని
పితృవాక్య పాలనా ♦ ప్రీతుఁడవగుట

గీ॥ వియ్యకొంటివి గాకేమి ♦ దయ్యమెఱుఁగు
నాగతానాగతంబుల ♦ నవనిలోనఁ
బుత్రధర్మంబనఁగ నదే ♦ పో తలంప ॥రమ్య॥ 44

సీ॥ అచిరకాలములోన ♦ నలసుంకరాన్వయ
తిలకుండు ధీరుఁ డా ♦ ల్మీయపురికి
హితులచేఁ దన పురో ♦ హితులచే మిము బంధు
మిత్రభృత్య చమూ స ♦ మేతముగను
వెడలించి కొనిపోయి ♦ విడియించి కీర్తి సం
పాది బంగారయ ♦ మంత్రిమౌళి
పరిభవంబుగ నాత్మ ♦ భవనాంతరంబునఁ
బౌరులు వచ్చిన ♦ బంధుజనులు

గీ॥ వినుతియొనరింపఁ దనకూతు ♦ వీరమాఖ్య
బాలికామణి నీకిచ్చి ♦ పరిణయంబొ
నర్చి మదినున్న తనకోర్కె ♦ దీర్చికొనియె ॥రమ్య॥ 45

సీ॥ సకల విద్వద్రాజ సభలలోఁ దనమాట
చనువాఁడు బంగార ♦ సచివుఁడెలమి
వైవాహిక మహోత్స ♦ వం బైదువాసరం
బులునిష్టమృష్టాన్న ♦ ములఁజెలంగ
నడిపి యాపరిణయా ♦ నంతరమున నీకు
బియ్యంబులకు బంధు ♦ వితతికెల్ల
నాత్మజను వీరమ ♦ నప్పగింతలుసేసి
యంపకాల్పలిపి మి ♦ మ్మర్హభంగి

గీ॥ బనుపఁగా వచ్చి రేపల్లె ♦ పట్టణమున
నింద్రుఁడో యితఁడనఁగ నూ ♦ రేగి కీర్తి
వెలయ సతితోడుత గృహావ ♦ వేశమైతి ॥రమ్య॥ 46

సీ॥ మరలునిద్రిలకున్నై ♦ తరలుట మొదలగు
వానిచే నీకెంత ♦ వాంఛయున్న
నల వివాహంబు వి ♦ ద్యా వినాశన హేతు
వనియున్న యార్యోక్తి ♦ వ్యర్థపఱుప
రాదని యేమొ తీ ♦ రని పాటిమై గురు
ముఖమునఁ జదువుటఁ ♦ బాసఁగదయ్యె
నెడనెడఁ దండ్రితో ♦ నింటఁ జదువుకొంట
యొకకొన్ని వేళల ♦ నూరకుంట

గీ॥ గాఁగ నిటు వత్సరద్వయ ♦ కాలమరుగ
నింక విద్యావిషయమై యు ♦ పేక్షచనద
టంచు నెటకేనిఁ దండ్రి ని ♦ న్ననుపఁదలఁచె॥రమ్య॥46

సీ॥ గుంటూర మన కను ♦ గుంజెలి గలఁడు న్యా
పతి శేషగిరిరాయఁ ♦ డతనియొద్ద
కితనిఁ బంచితిమేని ♦ హితవగు రీతిని
జదివించు ననుచు నీ ♦ జనకుఁడెంచి
పంచినఁ బోయి న్యా ♦ పతి వంశజునకుఁ
గాన్పించిన నిన్నాద ♦ రించికుశల
మడిగి రాకకు హేతు ♦ వడిగినఁ జెప్పిరే
వల్లె సమాచార ♦ మెల్లఁదెల్పి

గీ॥ శాఖవారల యొద్ద న ♦ న్జమవునట్లు
సేయుఁడనిమీకు మాతండ్రి ♦ చెప్పుమనియె
ననిన నగి నీకతం డిట్టు ♦ లని వచించె॥రమ్య॥ 47

సీ॥ ఉభయశాఖీయుల ♦ నొక్కటిగాఁ జూచు
సమబుద్ధి పండిత ♦ సత్తముండు
తర్క మీమాంస శా ♦ స్త్రజ్ఞుండు వ్యాకర
ణంబాతనికి గృహ ♦ నామ మింక
నది చెప్పనేమిటి ♦ కనఘుండు నాకాప్తుఁ
డక్కన శాస్త్రినా ♦ నలఘుయశుఁడు
రావణప్రముఖాసు ♦ ర గణంబులో గుణా
యుతుఁడు విభీషణుం డున్నయట్లు

గీ॥ లున్నవాఁ డీపురంబున ♦ నురుగుణుండు
నీవతనియొద్ద శాస్త్రిముల్ ♦ నేర్చికొమ్మ
టంచు నిను శేషగిరిరాయఁ ♦ డనునయించె ॥రమ్య॥ 48

సీ॥ అంత నాకాప్తకా ♦ ర్యము దీర్పఁ గలిగె నం
చని యుక్తమగు సమ ♦ యంబుగాంచి
యా శేషగిరిరాయఁ ♦ డక్కనశాస్త్రికి
నిను జూపి యితఁడు ♦ నా ♦ కనఘ మిత్రి
పుత్రుండు తండ్రి పం ♦ పునను దర్కంబు వ్యా
కరణంబు రెండు నీ ♦ కడన చదువ
వచ్చినవాఁ డాస ♦ పడి కావ్య నాటకా
లంకార సాహిత్య ♦ లంకృతుండు

గీ॥ వీనిఁ గైకొని వడి జది ♦ వించి కీర్తి
వడయు మీతఁడు చదువున ♦ వడిగలండ
టంచు నిన్నాతఁ డాతని ♦ కప్పగించె ॥రమ్య॥ 49

సీ॥ అక్కనశాస్త్రి ని • న్నటులఁ గైకొని మది
సంతసంబంది ని • రంతరంబు
శ్రద్ధతోడుతఁ దర్క • శబ్ద శాస్త్రంబులు
కంటను వత్తిడి • కఱపుచుండఁ
గాశీత్వంబునఁ • గఱచుచు నింకను
నవియెట్లు లివియెట్లు • లనఘ యనుచుఁ
గలశాబ్ధి మందరా • చలరాజ మనఁగఁ
గురువరు మతి నీవు • తఱచుచున్న

గీ॥ వేళ మును పాడసూపిన • విషమునంగ
వచ్చెఁగద వదనానల • జ్వాలలడర
విశ్వపతి యోగినిగ్రహా • వేశుఁడగుచు ॥రమ్య॥ 50

సీ॥ అటు విశ్వపతి వచ్చి • యహిభంగి రోఁజుచు
నక్కనశాస్త్రికి • మ్రొక్కియతని
నోలంబునకుఁ జేరి • నేల వీడుఁడు వీని
మీయొద్ద నునుచుట • మేలుగాదు
వీఁడు కృతఘ్నుండు • విద్వేషి వైదిక
బృందంబు నెడఁ దగ • డిందు నిలువ
నీతండు చనువంగ • నిందు రావలయు నే
మతిమంతు లందు బండి • తులు లేరె

గీ॥ పాలుద్రావి విషము గ్రక్కు • పాము వీఁడు
దోనముం గప్పి భార్గవు • తోడఁ జదువు
సూతజుని గతి నితడిందుఁ • జొచ్చె ననియె ॥రమ్య॥ 51

సీ॥ వెండియు నినుఁగూర్చి ♦ విశ్వపత్యసురుఁ డ
క్కనశాస్త్రితోడని ♦ ట్లని వచించు
బ్రాహ్మణులని చెప్ప ♦ రాని నియోగులు
మన వైదికులకు స ♦ మానులంట
వారు మనము పర ♦ స్పర గురుత్వాభివం
దన విధానములకు ♦ దగుదుమంట
గ్రామయాజనమున ♦ బ్రతికెడువారలు
బ్రాహ్మణాధములనఁ ♦ బడుదురంట

గీ॥ యిట్టి ప్రల్లదముల కస ♦ హ్యించి కాదె
వీని మామేనమామ పో ♦ షించె ననిన
విని యతం డిట్లు ప్రతివక్త ♦ విశ్వపతికి ॥రమ్య॥ 52

సీ॥ అల నియోగులు బ్రాహ్మ ♦ ణాన్వయు లటుగాక
యన్నింట మనకంటె ♦ నధికు లరయ
గులమును మతము నొ ♦ క్కటియైన వారల
న్యోన్య గురు ప్రణా ♦ మార్హు లెందు
వీరికి మనకును ♦ వృత్తిభేదంబు మే
మెక్కువ యనెదు నీ ♦ విక్కలింక
మానుము నీ మేన ♦ మామనే నీపల్కు
లాలించి యీ చతు ♦ రాస్య విడువ

గీ॥ ననుచుఁ బదరిన విశ్వప ♦ త్యసురుఁ డదరి
నచ్చి యీతనికడ కేల ♦ వచ్చితినని
చెంపలేసికొనుచుఁ బోయెఁ ♦ జెప్పకుండ ॥రమ్య॥ 53

సీ॥ అబ్ధి దరిచ్చెడువేళ నా • పాలవెల్లిలో
నావిఁబుట్టిన హాలా • హలమనంగ
గురుహృదయాబ్ధి నీ • తరచుకాలంబునఁ
బ్రత్యక్షమైన వి • శ్వపతిపాంగు
రాదరింబు దాల్చి నో ర నడంచి వాగీశుఁ
డక్కనశాస్త్రి వి • ద్యామృతంబు
దయచేసె నీకలు • తర్కంబు వ్యాకర
ణంబును రెండు సాంతము • గఁజదివి

గీ॥ గురునకు సమానుఁ డనిపించు • కొంటివంత
కంటె నధికుఁడ వనిపించు • కొంటివింత
వాసి గంటివి వత్సర • ద్వయములోన ॥రమ్య॥ 54

సీ॥ ఆరీతి శాస్త్రద్వ • యంబు నాసాంత మ
క్కనశాస్త్రి యొద్దనీ • వభ్యసించి
యుండంగ నాధాన • మొనరించు సంకల్ప
మున నిన్ను నిజగృహం • బునకుఁ దండ్రి
రమ్మని వర్తమా • నమ్ముఁజేసిన గురు
వీడ్కొని యచ్చోటు • వెడలి యింటి
కరుదెంచి తలిదండ్రు • లానందమునఁదేలు
చుండ మ్రొక్కిడి సుఖం • బొలసియుండ

గీ॥ నంత మీతండ్రి ఘంటయ • శాంతికార్య
కారణంబుగఁ దా నంది • గామ కేగి
కోడలిం దగువిధమునఁ • దోడితెచ్చె ॥రమ్య॥ 55

సీ॥ కోడలు వచ్చిన ♦ తోడనే చెప్పనో
రాడ దేమనఁగల ♦ వాఁడ నింక
మాలదైవమ్మును ♦ కూల దాంపత్యంబు
నోర్చనే యొకరిఁ బో ♦ కార్చఁగాని
దక్షావమానమై ♦ దాక్షాయణి నిజేశు
నీశ్వరు నెడబాసి ♦ యేగినట్లు
రోగావమానమై ♦ యేగె వీరమ దన
ప్రాణేశ్వరుని నిన్నుఁ ♦ బాసిదివికి

గీ॥ కటకటా యేమిసేయుంగఁ ♦ గలను విధికిఁ
దానొకటి మదిఁ దలఁచిన ♦ దైవమొకటి
దలఁచె ననుమాట యుండె సా ♦ ర్థకము నొందె॥ రమ్య॥

సీ॥ ఆకస్మికంబుగ ♦ నట్లు కోడలి పోక
కెంతయు మీఁతండ్రి ♦ చింతనొంది
యాధానమున కింక ♦ నటఁ బోదమనుచు నే
ననుకొన్న దేమి నా ♦ కైనదేమి
ప్రతికూల విధి కెంను ♦ బదులున్నదే బల
వంతమే విధికంటెఁ ♦ బౌరుషంబు
కనితీరవలెఁ గాక ♦ కాదని తప్పింప
నగునె యీశునకుఁగ ♦ ర్మానుభవము

గీ॥ అనుచుఁ దనయంతలో చింత ♦ నడఁచుకొనియె
దరుణుఁడయ్యును నీమది ♦ ధైర్యమూని
యచలుఁడైతివి కానున్న ♦ దయ్యెననుచు ॥రమ్య॥ 57

సీ॥ అంత ఘంటయ మంత్రి • యాప్రేత కగ్నిసం
సంస్కారంబు సలిపి సం • చయన ముఖ్య
ప్రేతకృత్యము లాచ • రించుచు నుండంగఁ
బదియవనాఁటి లా • భంబు నొందు
నంతకు మెదలక • యామీఁదఁ బదునొకం
డవనాఁడు సూర్యోద • యంబునందు
ఘంటయయింటికిఁ • గదలువారికి బహి
ష్కారంబటం చొక • సమ్మెపెట్టి

గీ॥ ప్రేతమెతుకులపై నాసఁ • బెట్టుకొన్న
కాకిపదువుల నాఁగెడు • గద్దవోలె
విశ్వపతి యాఁగెఁ గులబంధు • వితతినెల్ల ॥రమ్య॥ 58

సీ॥ పదునొకండవనాఁటి • యుదయంబునం బురో
హితుఁడు రాకుండుట • కేమిహేతు
వని ఘంటయామాత్యుఁ • డరిగి రామడుగు క
నకయ దీక్షితుని వి • నయముతోడ
నడిగిన నాతఁ డి • ట్లనె విశ్వపతి మాకుఁ
గట్టిడె మీయింటఁ • గాలు పెట్టు
వారికి వెలియని • నే రానికారణం
బది యింక నేమున్న • యది మన కన

గీ॥ విశ్వపతి కడకప్పుడ • వేగఁబోయి
వేడ నీవెంత వేడిన • వినదుబొమ్మ
రమ్మ నీకొడుకుంగూడి • క్రిమ్మ అననె ॥రమ్య॥ 59

సీ॥ అంతట మీతండ్రి ♦ యతివేగమున వచ్చి
యేమిచెప్పుదు మన ♦ కింతచెడుగు
జరిగినప్పుడె పగ ♦ సాధింపఁగా నెంచె
నని నీకు విశ్వాస ♦ త్యసురవాక్య
మెఱిఁగింపఁగా నీవు ♦ వృషభరాజము మేనఁ
బుండైనపుడె కాకి ♦ పొడుచుఁ గాదె
కర్మలుముంచెడు ♦ దుర్మతి యతఁడు నే
వేడఁబోవుదునె యా ♦ విశ్వపతిని

గీ॥ బోయి వేడిన నింతతోఁ ♦ బోవునొక్క
దుష్టులకు లొంగితిమయేనిఁ ♦ దొక్కఁజూతు
రేల యిఁకఁ గర్మ నేన చే ♦ యింతు నంటి ॥రమ్య॥ 60

సీ॥ పొద్దుమీఱఁగ వేగఁ ♦ బోయి స్నానముఁజేసి
వచ్చిన తండ్రిచే ♦ వైరివర్గ
మోరలఁ గనుచుండ ♦ ధీరత్వమూని సు
స్థిరుఁడవై యరాలోన సిద్ధపఱచి
తెచ్చిన పైతృమే ♦ ధికము చేతంగొని
శబ్దశాస్త్రార్థ వి ♦ జ్ఞాని వగుట
సక్రమంబుగఁ గర్మ ♦ జరిపించితివి మఱి
విబుధులు ముక్కుపై ♦ వ్రేలిడంగ

గీ॥ సారిది నాఁటి యేకోద్దిష్ట ♦ షోడశములు
నడిపిలివి హోమవిధి దుర ♦ న్న ప్రియులకు
గుండె బ్రద్దలుగా నగ్ని ♦ కుండములను ॥రమ్య॥ 61

సీ॥ మాసికంబునకు ని • మంత్రితులైన బ్రా
హ్మణులు నియోగు ల త్యంతధర్మ
పరులు కోటమరాజు • పట్టాభిరామయ
యును దిట్టకవి రామ • యోగిశాస్త్రి
యును వచ్చుచున్నాడఁ • గని విశ్వపతి యూత
లెదు రేగి ఘంటయః • యింటఁ గుడువ
నేగువారికిని బ • హిష్కార మని విశ్వ
పతి పల్కినది వినఁ • బడ దెయనిన

గీ॥ విశ్వపతి నామధారియా • వీఁడె కాదు
దేశగురువులు పీఠకా • ధిపులె కాదు
విశ్వపతికైన మేమింక • వెఱువ మనిరి ॥రమ్య॥ 62

సీ॥ అవ్విథినాడి ప • ట్టాభిరామయ రామ
యోగిశాస్త్రియును ని • యోగితిలకు
లతి ధైర్యసాహసు • లనవచ్చి యలరామ
యుగము పోలికె నింట • యున్నయంత
ద్వాదశాహంబున • స్వర్గపాథేయ స
పిండీకరణములు • రెండుజరిపి
మాసికం బల్ల ని • మంత్రిణపూర్వక
ద్విజకృతంబుగ యథా • విధిగ నడిపి

గీ॥ తప్పులెంచంగఁ గెలకులఁ • దారుచున్న
వైరివర్గంబునకుఁ దల • వంపుగాఁగ
నిర్వహించితి సర్వంబు • నియమమొప్ప ॥రమ్య॥ 63

సీ॥ అంతట విశ్వప ♦ త్యసురుండు నిన్నేమి
సేయఁజాలక మదిఁ ♦ జింతనొంది
జరిపిన విధమది ♦ శాస్త్రిసమ్మతమైన
నాచారభిన్నమౌ వ్యాజమునను
గర్తయు భోక్తలుఁ ♦ గర్మకారయితయు
భ్రష్టులెరని వెలి ♦ పత్రికలను
పేరులు లిఖియించి ♦ పీఠాధిపతులకు
నూరూరికిని రయ ♦ మారనడిపెఁ

గీ॥ బీఠపతులేమి యుది చెవిఁ ♦ బెట్టరైరి
మఱి మఱి లిఖించి పంపినం ♦ బలుకరైరి
గ్రామములుగూడ నట్లు ని ♦ రాకరించె। రమ్య॥ 64

సీ॥ అప్పుడు గుణవృద్ధు ♦ లైన నియోగులు కొంద
ఱొక్కెడ సభఁ ♦ గూర్చివిశ్వ
పతి దాను దైవ వం ♦ చితులనియును లేక
కర్మాంతరంబునఁ ♦ గట్టుచేసె
నతి సమర్థత వార ♦ లది నిర్వహించిన
వెలిజాబులను నిట్లు ♦ వెడలఁ జేసెఁ
గర్మ ముంచుట నీతి ♦ గాదన దాశాఖ
యసురకృత్యములన్న ♦ నవియె కావె

గీ॥ యెవరి యెడనైన వైదికు ♦ లిట్టివార
వారి మన యిండ్లకేఁకఁ బిల్వ ♦ వలదటంచు
జేసికొనిరఁట నియమ వి ♦ శేషమొకటి ॥రమ్య॥ 65

సీ॥ పెట్టలేడొకపూట ♦ పిడికెడన్నం బేనిఁ
గట్టడలకు మొన ♦ గాఁడితండు
పూపాన్నములకెంతో ♦ మొగమువాచితిమి మం
గళికైనఁ జేతిలోఁ ♦ గానిలేదు
ఒక్కరుగాదు ని ♦ యోగులండఱుఁ గూడఁ
గూడి పద్ధతిఁ బెట్టు ♦ కొన్నవారు
ఘంటయ యింటికిఁ ♦ గాలువెట్టిన బహి
ష్కారంబుమీకని ♦ కట్టుఁజేసి

గీ॥ వీఁడు మనకూటిలో దుమ్ము ♦ వేసినాఁడు
చావఁ డీవిశ్వపతి యని ♦ శాఖవారు
గూడి తమలోన గుజ గుజ ♦ లాడుదురఁట ॥రమ్య॥66

సీ॥ ఈరీతి నిరుతెగ ♦ వారున్నయెడ నీవు
గుంటూరునకుఁ జని ♦ గురునిఁగాంచి
విసతుండవైన నీ ♦ విధురత్వమును మున్నె
వినియున్న వాఁడౌట ♦ వేగనతఁడు
గురుఁదయాళుండు నిన్ ♦ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి
విధి సేత కేమి గా ♦ వింపఁగలము
శీఘ్రంబ పరిణయ ♦ సిద్ధి నీకగునని
యాశీర్వదించి ని ♦ న్నాదరించి

గీ॥ విశ్వపతి యాసురంబీవు ♦ వినిచినవిని
యసురుఁ డతడంచు నిన్ను ని ♦ జాలయమున
నుండుమన శాస్త్రిచర్చతో ♦ నుంటివచట ॥రమ్య॥ 67

సీ॥ ఆగర్తపురిని నీ • వక్కినశాస్త్రితో
శాస్త్ర పరిచయ చర్చ • సలుపుచున్న
నక్కిశాస్త్రికి • నాంత్యయంచు లిఖించి
యతనికి నచటి ధ • రామరులకు
జాబులు పంపి వి • శ్వపతి దానిగురుండు
సరకు గొనందు శి • ష్యప్రకరము
సంశయించుచు నోలిఁ • జనుచుండుటకుఁ
జింత నొంది నీకిట్లు న • యోక్తి ననియెఁ

గీ॥ జదివితివి శాస్త్రముల్ గాక • స్వప్రయోజ
కుఁడవు గావున వేదంబు • కొఱత దీర్చు
కొమ్మిదియె గురుదక్షిణ • పొమ్మనె నిను ॥రమ్య॥ 68

సీ॥ గురువరుఁ వీడ్కొని • గుంటూరు వెడలి రే
పల్లెఁ బ్రవేశించి • పరమనిష్ఠ
హరదత్త భాష్యాదు • లాధారముగఁ గొని
స్మార్తాచరణ విధి • సరణిఁదెలిసి
వారాశి సలిలంబు • ధారాధరముపోలె
వేదరాసిని వాక్య • వితతిఁగడఁకఁ
నీయంత గ్రహియించి • నేర్పుమైఁ బాణిని
ముఖ్యకృతి సహాయు • మునస్వరంబు

గీ॥ భేదమై బుద్ధికిఁగాను • పించు పట్ల
సంస్కరించితి వౌర సు • స్వరము పైచి
యభినవబ్రహ్మ వననేమి • యతిశయోక్తి ॥రమ్య॥ 69

సీ॥ గురుని ముఖంబునఁ ♦ గొనవలయును విద్య
యనియున్న యార్యోక్తి ♦ ననవనినిలుప
నిజశాఖయందు వి ♦ నీతుండు సమబుద్ధి
యక్కన శాస్త్రియే ♦ యనుచుఁ దెలుప
లోకగురుండు ను ♦ శ్లోకుండు కృష్ణుండు
సాందీపునొద్ద దాఁ ♦ జదివినట్లు
చదివితి వక్కన ♦ శాస్త్రి గురునిఁ జేసి
వేదమూర్తికి నీకు ♦ విద్యగఱప

గీ॥ గురుఁడు గావలయునె నీకు ♦ గురుఁడ వగుచు
హరిహరాంశను భూమిపై ♦ నవతరించి
యాసుగము మాన్ప వచ్చిన ♦ యనఘునకును ॥రమ్య॥

సీ॥ శారీర మధుర ర ♦ సంభాన నే తెంచు
రసికాళికిఁ బికస్వ ♦ రమ్మనంగ
బునగొట్టుచుం బైకి ♦ వెసవచ్చు విమతాహి
సమితికి షడ్జము ♦ స్వర్వమనంగ
దా నుదా త్తాను దా ♦ త్త స్వరిత స్వర
యోగంబు దనర మ ♦ హోన్నతముగ
లలిత పద క్రమా ♦ కలన జటా ఘనా
కీర్ణ వేదాభియో ♦ గినిచెలంగి

గీ॥ నీదు ముఖగహ్వరంబున ♦ నృత్యమాడ
నేకముఖమున బ్రహ్మ భూ ♦ లోకమునకు
దిగియెనని నిన్ను నూహఁ జెం ♦ దిరఁట జనులు ॥రమ్య

సీ॥ తత్కాలమందు బం ♦ దరులోన వడ్లమ
న్నాటి వెంకపశర్మ ♦ నాఁగనొక్క
త్యాగి యాశ్వేల ని ♦ యోగి మహాభోగి
యాగంబు వైదిక ♦ యాజనమున
సలిపి తా నవభృథ ♦ స్నాతుఁడై విప్ర సం
తర్పణ కధిక య ♦ త్నంబొనర్చి
పాయసాపూపాది ♦ భక్ష్య సహితమైన
పాకంబు పల్వుర ♦ కేకముగను

గీ॥ వైశ్వదేవపరుల కొక ♦ వంట వేఱు
గాఁగ జేయించి భోజన ♦ కాలమయిన
స్నానముం జేసి రండని ♦ జన్నిగట్ల ॥రమ్య॥ 72

సీ॥ సంభావనలకుఁగాఁ ♦ జనుదెంచి విశ్వప
త్యసుర ముఖ్యులు కొంద ♦ అందునిలిచి
నిన్నన్నమాటయే ♦ నిలుపఁగా మదినెంచి
మీరు నియోగులు ♦ మేము వైది
కుల మాట మీవంట ♦ గుడువము మాకు నా
మద ద్రివ్య పాక సా ♦ మగ్రిలిడిన
వంటఁ జేసికొని సా ♦ పడెదము గాకున్నఁ
బోయెదమని యొక్క ♦ పూన్కిఁజున్న

గీ॥ సోమయాజియు నిదియేమి ♦ చోద్య మాహి
తాగ్ను లటుసేయుఁడన విన ♦ కౌరి కడమ
వైదికులు నొను గాదన్న ♦ వారుగారు ॥రమ్య॥ 73

సీ॥ అంత వెంకప సోమ • యాజి వారలు గోరి
నట్టిడి భోజనా • నంతరమునఁ
దాంబూల దక్షిణల్ • తగినట్టు లందఱ
కును నిచ్చి వారిపై • డ్కాలిపివచ్చి
భోజియించి యారాత్రి • పోయి న్యాయాధి కా
రియు నిజాప్తుండు నా • కృత్తి వెంటి
వేంకటరామయ్యా • భిఖ్యునితోఁ జెప్ప
వైదికుల్ జేసిన • వంచన విని

గీ॥ తిన్న పందిరితోరణాల్ • ద్రెంచువీరి
యాజనము మూనుట ప్రతిక్రి • యాచరణము
కావున నవశ్య మటు సేఁత • కార్యమని యె ॥రమ్య ॥74

సీ॥ అట కృత్తి వెంటి వెం • కటరామయామాత్యుఁ
డా సోమయాజితో • నటువచించి
వెంటనే యొక లేఖ • విలిఖించి పంపె నీ
కది చూచి నీవుప్రి • యత్నమునను
బందరు పోయి క • న్పడ నాతఁ డానంద
భరితుఁడై యిట వేద • పాఠశాల
స్థాపించి నీ వుపా • ధ్యాయుండవై నియో
గులఁ జదివింపంగ • వలయు ననిన

గీ॥ వెదకఁ బోయిన తీగయే • పదముదాఁకి
నట్టి విధమయి యాకొంటి • వర్ణాభంగి
నియమములు బాలురకుఁ గొన్ని • నిర్ణయించి ॥రమ్య॥

సీ॥ నెలకొల్పితివి నియో ◆ గుల పాఠశాల నా
బందరులో వేద ◆ పాఠశాల
యజ్ఞానికివె య ◆ ధ్యక్షత వహియించి
సురజాలమును దేవ ◆ గురుఁడువ్వోలె
శిక్షించుచు నియోగి ◆ శిష్యవర్గంబు శ్రౌ
త స్మార్త మంత్రితం ◆ త్రిప్రయోగ
ధర్మంబులును వాని ◆ మర్మంబులు నెఱుంగ
బోధించుచుంటివి వ ◆ ప్పుడు కనంగ

తే॥ నాగమ వనాంత రేచ్ఛావి ◆ హార వైరి
మదగజములకు సింగపుఁ ◆ గొదమమాడ్కి
దోఁచితివి స్వర గర్జల ◆ తోడఁ గెరలి ॥రమ్య॥ 76

సీ॥ అవ్విధంబున సుస్వ ◆ రాన్వితంబులు వేద
పాఠముల్ కలిపు నీ ◆ ప్రౌఢిమగని
వైదికులును జను ◆ వంగ రా సూర్వారె
నూఱు మోముల ◆ ష్రితి నుడువుచున్న
సమ్మృతాశనేచ్ఛా స ◆ మైక్య దేవాసుర
మండల క్షీరాబ్ధి ◆ మథనమనఁగ
శతముఖుఁడమ్యో మ ◆ త్ప్రతి యంచు భారతి
నలికేఁగి నలుపుతాం ◆ డవమనంగ

తే॥ జూచువారల బుద్ధికిఁ ◆ దోఁచుచుండె
నటు నియోగులు వైదికు ◆ లచటనున్న
బలసిచదువంగ నటు గానఁ ◆ బడకయున్న ॥రమ్య॥77

సీ॥ అతులల నీ వొప్పి యు ♦ న్నంత దో నేపూడి
వేంకటరాయఁడన్ ♦ విమలయశుఁడు
తనకూతు గుణరత్న ♦ ఖనియగు కోటమాం
బికనిచ్చి నీకతి ♦ విభవ మెసఁగఁ
బరిణయం బొనరించె ♦ బంధుయాజన మది
పొరయుట నగ్రితాం ♦ బూలచర్చ
జలిపిరి వైదికుల్ ♦ సదసునఁ దమమాట
చెల్లమి నల్లరి ♦ చేసిరేచి

గీ॥ దానివిని వెల్లటూరను ♦ దాడికొండ
సుబ్బరాయ పంచాస్యంబు ♦ బొబ్బరించె
వైదిక గజంబు లెడఁదిగ్లి ♦ వఱలెఁబెండ్లి ॥రమ్య॥ 78

సీ॥ వైవాహికంబయి ♦ వచ్చి వధూసహి
తముగ గృహప్రవే ♦ శమయి యంత
బృందావనపురంబు ♦ నందు నెప్పటియట్లు
శిష్యులతోఁ బ్రవే ♦ శించివారిఁ
జదివించుచుంటి గీ ♦ ష్పతివొలె నాపాఠ
శాల సుధర్మనాఁ ♦ గ్రాలుచుండె
నత్తరి గడలూరి కల ♦ కృత్తి వెంటి వేం
కటరామయ ప్రభుత్వ ♦ కార్యవశత

గీ॥ నేగుచున్నంత నతనితో ♦ నేగితీవు
బంటుమూఁకల నెల్లను ♦ వెంటఁగొనుచు
దిగ్విజయ వాంఛతో నర ♦ దేవునట్లు ॥రమ్య॥ 79

సీ॥ కడలూరి కేగి వేం ♦ కటరామ యార్యుని
తోఁ గొన్ని దినములం ♦ దున వసించి
కడలూరు నందుండి ♦ కాంచీ పురమునకు
శిష్యులతోడ భా ♦ సిలుచు వచ్చి
యట రామచంద్ర ద ♦ యోగానంద యతితోడ
వేదాంత విద్యా వి ♦ నోదగోష్ఠి
వెలసిల్లఁ బండిత ♦ వృషభుండ వనినిన్ను
విని మధ్వ విద్వాంస ♦ వృషభగణము

గీ॥ బింకె వేయుచు విజయని ♦ శ్శంక వృత్తి
నీకెఁ బరతెంచి యొక్కటఁ ♦ దాకి శృంగ
భంగమై పోయెనట పరా ♦ భవమునొంది ॥రమ్య॥ ౮౦

సీ॥ విజయధ్వజం బందు ♦ వెలయించి వేంకట
రామయ శర్మ దాఁ ♦ బ్రభుని సెలవు
గాని యున్న నాతనిఁ ♦ గూడి చిదంబరం
బాదిగాగను సేతు ♦ వంతముగను
సేవించి తఖిల ద ♦ క్షిణ దేశ యాత్రలు
నందందు విజయంబు ♦ లందుకొనుచు
నంతట గడలూరి ♦ కరుదెంచి సుఖమున్న
నా యలఘుండవు రో ♦ గార్తుఁడగుచు

తే॥ నందనులను గామేశ్వ రా ♦ నందరాయ
శర్మలను నిర్వరను నీవ ♦ శంబుఁ జేసి
చనితె స్వర్గమునంద నా ♦ పథులకనఁగ ॥రమ్య॥ 81

సీ॥ ఆకస్మికంబుగ ♦ నట్లు వేంకటరామ
యార్యుని పోకకు ♦ నడలుచున్న
తత్సతీ సుతుల సం ♦ తాపంబు వాయంగ
విమల వాక్యామృత ♦ వృష్టిగురిసి
యపరక్రియాళి త ♦ దాత్మజ కృతముగా
నడిపించి వారి బృం ♦ దావనపురిc
జేరిచి మునువోలె ♦ శిష్యవర్గము నీవు
చదివించు చున్నంత ♦ సమయ మెఱcగి

తే॥ వత్సర విమూక లాభంబు ♦ వడయ పొంచె
కృత్తి వెంటి వారికిc బురో ♦ హితులమనుచు
వైదికు ల్నిను వేడంగ ♦ వచ్చిరంట ॥రమ్య॥ 82

సీ॥ వైదికుల్ వచ్చి పూ ♦ ర్వమువోలె యాజక
త్వంబు మాకీయంగ ♦ వలయుననిన
గుడువcగూడదు నియో ♦ గుల యింట మీరు నా
మద్రవ్యముల నీయ ♦ మాకుcగాదు
కావున మనకెట్లుc ♦ గలియదు పొందు పొం
డనుచు వెంకప సోమ ♦ యాజి సోమ
యాగమందలి వారి ♦ యాగమంతయు జప్తి
చేసి నీ వాడcగా ♦ సిగ్గుపడుచు

గీ॥ నాcటి కేగియు నేడూరి ♦ నాcడు వచ్చి
పల్లదము లానరిచి రాజ ♦ భటులచేత
నీడ్వcబడి యాకొఱcత దీఱి ♦ యేగిరంట ॥రమ్య॥ 83

సీ॥ పదపడి నీవు రే ♦ పల్లెలో నొక పాఠ
శాల ప్రతిష్ఠించి ♦ జనకునందు
గురునిగా నియమించి ♦ యిరుచోట్లు లరయుచు
శిష్యుల శిష్టులఁ ♦ జేయదలఁచి
స్నానాదికము లుద ♦ యానకే నెఱవేర్చు
టాదిగాఁగ నిబంధ ♦ నాష్టకంబు
సేయఁగాఁ బల్వురు ♦ శిష్యు లిండ్లకు నిచ్చఁ
జని రట్టి నియమముల్ ♦ జరుపలేక

గీ॥ యగ్రజాలకు స్వధర్మంబు ♦ లైనవైన
సుఖము నలవాటు పడియున్న ♦ సోమరులకుఁ
గష్టములుగావె నీచేయు ♦ కట్టుబాట్లు ॥రమ్య॥ 84

సీ॥ తాలు గాలికిఁ బోవ ♦ ధాన్యంబు నిల్చిన
చందాన నిల్చిన ♦ ఛాత్రగణము
నీ పెట్టు నియతుల ♦ కోపుదు మని వచ్చి
కూడిన నవ శిష్య ♦ కోటిగూడి
యెప్పటి సంఖ్యయై ♦ యొప్పి నిబంధన
లొప్పక విద్యలఁ ♦ దనరుచుండె
గౌరవతో నేరిచి ♦ షోడశ కర్మాధి
కారులై మును యాజ ♦ కత్వమునకు

గీ॥ నొప్పువారలు భవదాజ్ఞ ♦ నొంది కొంద
ఱేగి గ్రామాంతరముల ని ♦ యోగి పాఠ
శాల లుంచిరి బంధుయా ♦ జకులునగుచు ॥రమ్య॥ 85

సీ॥ మఱియు విద్యలలోన ♦ గలువత్తె యున్నశి
ష్యులఁ బాఠశాలకు ♦ నొజ్జలుగను
నియమించి స్వేచ్ఛగా ♦ నీవుపన్యాసముల్
సలుప నుభయ పాఠ ♦ శాలలందుఁ
గన్నిడి యందందుఁ ♦ గావించు సభలలో
స్మార్తుల వుండరీ ♦ ర్యాంబాలక
నిల్వ బొట్టులు వీడ ♦ ని నియోగులుం గూడ
వైదిక శెట్టుట ♦ వైరులగును

గీ॥ దుష్ట వాదంబులకుఁ జొచ్చి ♦ మూఱిరంట
కాని పాతములపై నభి ♦ మానముంచి
ధర్మ మెంత పాపిష్టిదో ♦ తమకుఁ జూడ ॥రమ్య॥ 86

సీ॥ రాక పోకల రెండు ♦ గ్రామంబులందుండు
పాఠశాలలను గా ♦ పాడుకొనుచు
ధరణీశ్వరుల నీవు ♦ దర్శించి రా భవ
జనకుండు ఘంటయు ♦ సన్యసించి
యత్యాశ్రమమున బ్రీ ♦ హ్మానంద పద పూర్వ
క సరస్వతి యనంగ ♦ నెసఁగి పరమ
పద మొందె నంత రే ♦ పల్లె పురీ వేద
పాఠశాలా భార ♦ వహుఁడ వైతి

గీ॥ నూజవీటి నృపాలాది ♦ రాజవరుల
వార్షికంబులు మఱి యన్య ♦ వార్షికములు
వచ్చుచుండె శిష్య గ్రాస ♦ వాసములకు ॥రమ్య॥ 87

సీ॥ విమతులు జంధ్యాల ♦ విశ్వపత్యాదులు
శిష్యుల బుద్ధులు ♦ చెఱుపుచున్న
శిష్య సందేహ వి ♦ చ్ఛేదంబు విశ్వప
త్యసుర విజయ మను ♦ నది రచించి
నీ విష్టసిద్ధికై ♦ నిష్ఠ యొప్పార మే
ధా దక్షిణామూర్తిఁ ♦ దప మొనర్చి
యానంద వర్షంబు నందు ♦ న గ్న్యాధాన
మొనరించి దీక్షితుఁ ♦ డనఁగ నెసఁగి

గీ॥ పిష్ట పశ్వధ్వర వివేక ♦ మిష్టకృతిగ
వ్రాసి తద్యాగమును విశ్వ ♦ పతి కలంగ
నాచరించుదు నఁట ♦ ప్రీతి హాయనంబు ॥రమ్య॥ 88

సీ॥ పత్రికలను విశ్వ ♦ పతి పీఠ పతులకు
రండు రండోయని ♦ వ్రాసి వ్రాసి
పంపంగఁ బంపంగఁ ♦ బంచ వింశతి హాయ
నములకు రక్తాక్షి ♦ నామ వత్స
రమున శరద్వాన ♦ రముల శాత్రిపులపై
దాడి వెడలు నేల ♦ ఛేఁదనంగఁ
చతురంగబల సమ ♦ న్వితుఁడయి యేతెంచి
పుష్పగిరి యతిప్రి ♦ భుండు కడఁక

గీ॥ విడిసె రేపల్లె నగరంబు ♦ విడిదలగను
నందుఁ బండితు లఱువది ♦ మందిగలరు
విశ్వపతియును మంత్రియై ♦ వెలసె నపుడు ॥రమ్య॥ 89

సీ॥ స్వామితోడనె వచ్చె ♦ ఝుంఝూనిలంబది
పరిశయ భైరవ ♦ ముఖా ర్భటియనంగ
నీలమేఘంబులా ♦ నింగిపై గాలికిఁ
గొట్టుక పోయెడు ♦ కొండలనఁగఁ
బృథు వర్షధారలా ♦ యింద్రచాప విముక్త
రస లోహమయపు నా ♦ రసము లనఁగ
ధన జీవములకు ని ♦ ర్దయుఁడయి బాధించు
యతిరాజు లయకాల ♦ యముఁ డనంగ

గీ॥ దోఁచె నుప్పెన జందరు ♦ నూఁచె నేఁచె
లోకమెల్లను నల్లక ♦ ల్లోల మయ్యె
నయ్యయో యేమనంగల ♦ దా యవస్థ ॥రమ్య॥ 90

సీ॥ అంతం దెలిపి గాంచి ♦ యతివరుం డొనరించె
సభ యొండు నీతోడఁ ♦ జర్చ సేయఁ
బండిత మత్తవే ♦ దండంబు లేతెంచి
నిండెఁ దత్సభలోన ♦ నిన్ను గెలువ
నొక్క దీక్షితుఁ డెట్టు ♦ లోపి యిందటితోడ
వాదించు నని చూడ ♦ వచ్చి రొరులు
విశ్వపత్యసురుండు విమతుండు నీరాక
వేచి కూర్చుండెఁ గో ♦ విదుల నడుమ

గీ॥ నా సభామండలమున క ♦ గ్రాసనాధి
పతులు జంగనరాయ భూ ♦ పాల మాళి
తాటి రామయమంత్రి స ♦ త్తము లిరువురు ॥రమ్య॥ 91

సీ॥ స్వామిదూతలు భవ ♦ త్సదనంబునకు వచ్చి
యతిముఖు ల్మిమ్ము ర ♦ మ్మని రనంగ
గిరిగుహా నివసింప గ్రామముల ♦ గీజేన
కరుల స్సైఁ బోవుసిం ♦ గం బనంగ
నతి ధీరతం బోయి ♦ యతిపతి మతిగాన
నతిఁ జేసి తెదుట గ్రం ♦ ధంబు వెట్టి
యది యాయతీంద్రాన ♦ కవమానముగఁ దోఁచె
నభిమానిగ గణింగి ♦ తతని నీవు

గీ॥ శ్రుతులు స్మృతులు పురాణముల్ ♦ సారిది మేల్ప్రి
మాణములు వాదములు వ్రాత ♦ మయములను ని
బంధనలఁ జేసినారుల నా ♦ గ్బంధనంబు ॥రమ్య॥ 92

సీ॥ వాగ్రూపములు పోతు ♦ వాదముల్ సభలోన
గుజ గుజ లల్లరుల్ ♦ గూడవనుచు
నిరునాఁగు వాదముల్ ♦ గురులు విమర్శించి
శ్రీముఖంబునఁ దీర్పు ♦ జెప్ప వలయు
నని పల్కు యిది వ్రాలు ♦ నని యధికారుల
యెదుట యతీశ్వరుం ♦ డియ్యకొనినఁ
బండితులం వల ♦ పని కర్మలం గూర్చి
సి చేసినవి యెల్ల ♦ నేరములను

గీ॥ వారి వాదములకుఁ బ్రతి ♦ వాదము లను
శాస్త్ర విహిత ప్రమాణముల్ ♦ సంఘటించి
వ్రాసితేఁట వేయిచేతుల ♦ వ్రాఁతనంగ ॥రమ్య॥ 93

సీ॥ విలిఖించితివి శాస్త్ర ♦ విహితోత్తరంబులు
పండిత ప్రవరుల ♦ గుండె లవియ
నదికారణంబుగ ♦ యతిపతి చెప్పుడు
వివరించి శిరిని ♦ విజయమనుచు
నందరు విన నీవు ♦ ముందు గోరినయట్లు
తీర్పు శ్రీముఖమునఁ ♦ దెలుపుచునని
యీకొనియెద వరి ♦ కీవె యోడుదువని
యుల్లొజితింగిన ♦ నియ్యకొను నె

గీ॥ సర్వజన సముద్రైతి నిత్య ♦ సత్యవచనుఁ
డైన సన్న్యాసి ధర్మ ♦ మిట్లైన నింకె
నితరు లభిమానముం జూపు ♦ టేమి వింత ॥రమ్య॥ 94

సీ॥ వజ్రతుల్యములు నీ ♦ వాదంబులగుటచే
నొంట భేదింప రా ♦ కుంటఁ జేసి
తెలివుగానక యేది ♦ తెలుపకుండిన నీవు
మఱి మఱి యతివరుఁ ♦ డడిమియుడుగ
నీవె గెల్చితి వింత ♦ నిజము పల్కుమని మాట
గాఁ దెల్ప డది పత్రి ♦ కా ముఖమున
నది యేమియని యతి ♦ నధికారు లడిగిన
వారలతో తీర్పు ♦ వ్రాయుదునని

గీ॥ కాలమంతయు మాటలఁ ♦ గడపి తుదకు
వ్రాయ కదిపోకగాఁ బోయె ♦ స్వామి తన్ను
రోయఁగా విశ్వపతి చిన్న ♦ వోయి పోయె ॥రమ్య॥ 95

సీ॥ అంతట దీక్షితుం ♦ డింత యొప్పుగ బల్కె
యొక్కండ పెక్కండ్రె ♦ నక్కడంచు
దీక్షిత నామ మొం ♦ దిన సార్థకం బిట్టు
లుండవలయుఁ గాక ♦ యూర కేల
శాస్త్ర వాదంబుల ♦ సాష్టాంగ మిడకున్న
దీక్షితునకు మన ♦ ధిషణుఁ డైన
దీక్షితుండన దేవ ♦ దేవుండు గాఁడో కో
తగు సీతనికి దీక్షి ♦ త ప్రశంస

గీ॥ యనుచు నీ విజయమునకు నా ♦ త్మ లలరి
నిర్జరు ల్మింటిపై నుండి ♦ నిన్నుఁ గూర్చి
వినుతి యొనరించి రట పుష్ప ♦ వృష్టి గురిసి ॥రమ్య॥96

సీ॥ కులసతీ తిలకంబు ♦ కోటమాంబికయందు
సంతాన ఫలముల ♦ జాడఁ దసరఁ
గంటివి రామ ల ♦ క్ష్మణుల చందంబున
నన్యోన్య మైత్రితో ♦ నలరు సుతుల
ననఘుల యజ్ఞనా ♦ రాయణ సూర్యనా
రాయణాభిఖ్యులఁ ♦ గ్రమముతోడ
నందనులకు నుప ♦ నయనాది కార్యముల్
నెఱవేర్చుకొంటివి ♦ తఱి యెఱింగి

గీ॥ యంతటంతటఁ గలుగు న ♦ వాంతరముల
కొలఁది నేక కృతుల్ వ్రాసి ♦ తఱిమితంత
వెలి జలచి దరులింకఁ ♦ గొలఁత యేమి ॥రమ్య॥ 97

సీ॥ అద్వైతమును నను ♦ రాద్వైతి మనియు ద్వై
వాద్వైత మని ద్వైత ♦ యముగఁ జేసి
యసుర మార్గము దోష ♦ మని నిరూపించి దై
వ పథంబుఁ జూపితి ♦ స్వజనమునకు
నాసురాన్నంబు గా ♦ దని దైవతాన్నంబు
పితృ దేవతల కింత ♦ భిక్షయిడితి
మాతృదేవతకుఁ గు ♦ మారధర్మంబనఁ
గైవల్యమునకు మా ♦ ర్గంబుఁజూపి

గీ॥ చిన్నమాంబ కడుపు మోసి ♦ కన్నఋణము
దీర్చుకొంటి వందితి గురు ♦ దీక్షితాఖ్య
మఱియు నీపుట్టువున కైన ♦ కొఱఁత గలదె ॥రమ్య॥

సీ॥ బ్రహ్మచర్యంబు గా ♦ ర్హస్త్యంబు నడిపి వా
నప్రస్థమును దీర్చి ♦ సుప్రసిద్ధ
వాసరంబందు స ♦ న్యాసంబు గైకొంటి
రహిఁ జిదానంద స ♦ రస్వతి యన
శ్రీ శ్రీముఖాబ్ది కా ♦ ర్తిక శుద్ధ నవమిని
సిద్ధి గాంచితి ♦ కీర్తి శేషుఁడగుచు
నాఁట నుండియును నీ ♦ నాఁటికారాధనల్
వఱలు చున్నవి ♦ నీకు వార్షికముగ

గీ॥ నఘ నిబర్హణ మని భవ ♦ దనఘ చరిత
సీస పద్యంబులందు వ్రా ♦ సితిశతకంబు
నీ దయఁ బూర్తి చేసితి ♦ నేర్చినట్లు ॥రమ్య॥

సీ॥ వరఁగుచున్నది ప్రజో ♦ త్పత్తి వత్సరము నేఁ
డభివించినది ప్రజో ♦ త్పత్తి యగుట
నలువది యేండ్ల ప్రా ♦ యమున వ్రాయఁగంటి
శతక రూపమున నీస ♦ చ్చరిత్ర
నను వ్రాయుమని ప్రేర ♦ ణముఁ జేసి యాత్మీయ
జీవితమెల్ల నీ ♦ సేవ తోడ
గడపెదనని ప్రార్థి ♦ యింతుమల కోర్కి ని
యోగ సుస్థితిఁ బ్రోచు ♦ చున్నదివ్య

గీ॥ తేజుఁ గ్రహన కోటీశ్వరాగ ♦ దీక్షితాఖ్య
కృతున కలఁగుగఁ గృతి నను ర్పి ♦ ంచి నాఁడ
నందుకొను మిదె నా ♦ యభివందనములు
రమ్య గుణధుర్య లక్ష్మీనా ♦ రాయణార్య॥ 100

26269
25·3·73.

సంపూర్ణము.

